శ్రీ రామాయనమః

# తల్పగిరి రంగనాయక శతకము

విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

వాసుదాస స్వామి



శ్రీయై



శ్రీరంగనాయక్యైనమః

# తల్పగిరిరంగనాయకశతకము

శ్రీమదాంధ్ర వాల్మీకి

వా వి లి కొ ల ను సు బ్బ రా య వి ర చి త ము



ప్రచురణ కర్తలు

## శ్రీకోదండరామ సేవక ధర్మ సమాజము

దాసకుటి. అంగలకుదురు (వయా) తెనాలి.

శ్రీరామసేవ



# శ్రీకోదండరామ సేవక ధర్మ సమాజము

దాసకుటి - అంగలకుదురు.

(తెనాలి తాలూకా గుంటూరు జిల్లా)

మందరము

బాలకాండము
అయోధ్య కాండము 1 భాగము
,, 2 ,, అచ్చులోనున్నది
అరణ్యకాండము
కిష్కింధాకాండము
సుందరకాండము
యుద్ధకాండము 2 వాల్యములు
ఉత్తరకాండము
బాలకాండము (మూలము పద్యము)
అయోధ్యకాండము ,,
అరణ్యకాండము ,,
కిష్కింధాకాండము ,,
సుందరకాండము ,,
యుద్ధకాండము ,,
ఉత్తరకాండము ,,
సీతాదేవిచరిత్ర
హనుమంతునిచరిత్ర
రుక్మాంగధచరిత్ర
నలచరిత్ర
సావిత్రీచరిత్ర
శకుంతలచరిత్ర
హరిశ్చంద్రచరిత్ర
వామనచరిత్ర

శ్రీ



రెండవ కూర్పు

# పీ ఠి క

శ్లో ॥సప్తప్రాకారమధ్యే సరిసిజముకుళోద్భాసమానే విమానే
కావేరీమధ్యదేశే ఫలపతిశయనే శేషపర్యంకభాగే
నిద్రాముద్రాభిరామం కటినికటశిరం పార్శ్వవిన్యస్తహస్తం
పద్మాధాత్రీకరాభ్యాం పరిచితచరణం రంగనాథంభ జేహమ్.

ఈ చిన్న పొత్తమునకొక చిన్ని యైతిహ్యముగలదు. పెక్కురెఱిఁగిన యది మద్గ్రంథముల నందల దుక్తము. శ్రీకుమారాభ్యుదయమును సమ్మానింపనీ యూరఁగీ ర్తిశేషులైన సి. శరభిలింగనాయఁడు, బి.ఎ.గారి యధ్యక్షతక్రింద1893న సంవత్సరమున సభ జరిగెను. దానికీ యూరఁగల పెద్దమనుష్యులెల్ల నాహ్వానింపఁబడిరి. ఆ హూతులలో నొకరు కృశకాయుఁడనై యుండు నన్నుఁ గని యీయనమేమి యీ గ్రంథము వ్రాయుటయేమి. ఇది నమ్మరానిమాట. ఈపేరుగల యీయన పెద్ద లెవ్వరో రచించినదానిని నీయన తనదిగా ముద్రించి యుండవలెనని వాకొనిరఁట. సభనాఁటి కిది నాకు శ్రవణ గోచరము కాలేదు. ఆవల రెండు మూఁడు దినముల కిది వెలువడెను. అప్పుడ నే నేమి సాక్ష్యము చూపి వారిని మెప్పింపఁగలను ? అనువు గాని వేళ నధికుల మనరాదని విని విననట్లూరకుండ వలసివచ్చెను. ఆవలఁగార్తిక శుద్దైకాదశి ప్రాప్తించె ఆనాఁడుదయము పదిగంటలవేళ మిత్రులతో సంభాషించుసమ యంబున నీ దినము హరివాసర మూరక పోనేల? మారంగయనాకులపై నొక శతకము చెప్పుమని వారు కోరిరి. అట్టులే కానిండని యంగీకరించి యింటికిఁ బోవుచు మార్గమధ్యమునఁగొన్ని కాగిదములఁ గొనిపోయి భోజనానతం తరము కూర్చుండి యీ శతకము రచించి రమారమి 3–30 గంటలవేళఁ గొనిపోయి పూండ్ల రామకృష్ణయ్యగారి కర్పించితిని. వారు చూచి సంతసించి యావల దీనికై యొక సభజరిపి యాసభ యందీ విషయము విశదీకరించిరి.

విక్రమసింహపురి రంగనాయకులకు గిరియే తల్పము కావునఁ దల్పగిరి రంగనాయకులని యందురు.

ప్రపంచమే రంగము (నాట్యభూమి) ఈ రంగమునకు నాయకుఁడు కావున భగవంతుఁడు రంగనాయకుఁ డయ్యె. కావుననే దీనిని లీలావిభూతియందురు. లోకవత్తులీలాకైవల్యమ్మని బాదరాయణుఁడు బ్రహ్మసూత్రంబుల ననుగ్రహించెఁగదా. జగన్నాటక సూత్రధారుఁడు శ్రీమన్నారాయణుఁడే. ప్రకృతి విశిష్ట జీవాత్మలే పాత్రములు. ఈ తోలుబొమ్మలచే భగవంతుఁడు నాటక మాడించుచుండును.

శ్లో. ఈశ్వర స్సర్వభూతానాం, హృద్దేశేర్జున తిష్ఠతిభ్రామయన్
సర్వభూతాని యంత్రా రూఢాని మాయయా. భ.గీ.

యని కలదుకదా. ఏమిప్రయోజనముఁగోరి భగవంతుఁ డీ నాటక మాడించుచున్నాఁడను సందేహము విచారతత్పరులకుఁ గలుగకమానదు. అవా ప్తసమస్తకాముఁడగు భగవంతునకు నీ నాటకమువలన నెట్టి స్వప్రయో జనములేదు. జీవకోటియంతము భగవంతునకుఁ బుత్రప్రాయము. భగవంతుఁ డగు శ్రీరామమూర్తి చెంతన యుండియుఁ దత్సాంగత్యమువలనఁ గలుగు నానందముతో సంతుష్టిపడియుండక మాయామృగముపై మక్కువ గలిగి భగవంతునికిదూరమైన సీతవలె యనాది కాలమున జీవుఁడు భగవత్సాంగత్యమువలని యానందముతోఁ దనివి చెందక గడియకొక వేషము వేసి సింగారించుకొనువేశ్యను మోహించి దానివలలోఁబడి కూరిమిగల తల్లిదండ్రు లభార్యల విడనాడు మూఢులవలె సర్వ వేళల వివిధకారములఁ జెందు చుండు ప్రకృతికివశుఁడై సంసారసాగరంబునఁ గూలుటఁగాంచి పరమకారుణికుండైన భగవంతుఁడు ప్రకృతిసంసర్గము లేశమైనను దుఃఖకారణమే యనుజ్ఞాన మనుభవముచే జీవునికిఁ గలిగించి స్థిరపఱిచి మరల దానిపై మనసు పోనీకుండుటకై యధమాధమ జన్మము మొదలు పరిణామక్రమమున నుత్తమోత్తమ జన్మము వఱకు నెగఁదీసికొనివచ్చి తుదకుఁబ్రకృతి బంధముక్తుఁ గావించి తనయొద్దఁజేర్చుకొని గుణహీనుఁడైన కుమారుఁడు మరల సుగుణవంతుడై తన్ను సేవింపరాఁగా సంతోషిం చు తండ్రివలెనే సంతోషించును. ఈ నాటకమువలని ప్రయోజనము జీవాత్మలనుఁ గడదేర్చులయే కాని వేఱొండు గాదు. ఈ నాటకములో సాధుజీవులకు నసాధు జీవులచే బాధ గలిగినప్పుడు తానను సమయోచిత వేషము వేసి కొనివచ్చికార్యమ చక్కఁబఱిచిపోవును. దీనినే కవితార్కిక సింహు లిట్లు చెప్పిరి.

శ్లో. దేవోనశ్శుభ మాతనోతు దశధానిర్వర్తయన్ భూమికాం
రంగేధామని లబ్దనిర్భరరసైరధ్యక్షితో భావుకైః
యద్భావేషు పృథగ్వి దేష్వనుగుణాన్ భావాన్ స్వయం

బిభ్రతీ, యద్ధర్మైతిహధర్మిణీవిహర తేనానాకృతిర్నాయికా

కుఱుచవాకిటఁ దలయెత్తి దూఱి తలదగుల గాయపడి దేవుని దూషించు టెట్టిదో మనకుఁ గష్టముగలిగి నప్పుడు భగవంతుని నిందించుటయు నట్టిదె. భగవంతుఁడు నిరపాయమగు మార్గము మనకు శాస్త్రమూలమున బోధించియుండియుఁదదాజ్ఞ నుల్లఘించి మీఁది చేటుగానక స్వేచ్ఛగావర్తించి కీడుగలిగినప్పుడు భగవంతుని దూఱిన నేమి లాభము? నిప్పుదాఁకినఁ జేయి కాలునట్లు పాపముచేసినఁ బాపఫలము కర్మానుగుణముగా వచ్చును గాని యది భగవంతుఁడు మన పైఁగ్రోధముచేఁ జేసిన శిక్షగాదు. ఒకసారి నిప్పుదాఁకినవాడు మరల నిప్పెట్లు దాఁకడో యట్లే జారత్వచౌర్యాదిపాపములఁ జేసి తత్ఫల మనుభవించినవాఁడు మరల నట్టి కార్యములఁజేయఁడు. శాస్త్రవిశ్వా సము వృద్ధసేవ భగవద్భక్తి లేనివాఁడిట్లనుభవజన్యజ్ఞానముచేఁ గాలాంతరమునఁ గడతేఱును. అవికలవాఁ డచిర కాలముననే ముక్తుఁడగును. ఇదంతయు భగవంతుఁడు మనయందలి ప్రేమచేఁ జేయుచున్నాఁడు గాని యితర కారణమునఁ గాదు. మూర్తీభవించిన కరుణయే లక్ష్మీదేవి. ఆమె యన పాయినియై సర్వదా భగవంతునితోడయుండును. (ఈ విషయము విపులముగఁ దెలియఁ గోరువారు శ్రీకృష్ణావతార తత్త్వమునఁ జూచునది.)

ఇక్ష్వాకు మహారాజు తపస్సుచేయఁగాఁ భగవంతుఁడాయనకు సకలాయుధ యుతుఁడై శ్రీరంగనాయకమూర్తి వహించి గోచరించి నీకేమివరము కావలయుననిన నీమూర్తితోనే ప్రతిదిము మాయింట నర్చనలఁ గైకొమ్మని యాయన కోరెను. ఆనాఁడు మొదలు రంగనాధుఁడు లక్ష్మీసమేతుఁడై యిక్ష్వాకుల యింటివేల్పైకులధనమై వారియింట నర్చింపఁబడుచుండెను. ఇట్టి వరము విభీషణుఁడు శ్రీరాములఁ గోరఁగాఁ దనకు మాఱుగా శ్రీరంగనాథుని నాయన కిచ్చి దీని నెందైనఁ గ్రిందనుంచక కొనిపొమ్ము. నేలసోఁకెనా యిది యందే నిలిచిపోవును. అని యా దేశింపనెట్లె దానిని దిరుపగూడ యందుంచి తెచ్చుచుండు సమయంబున నుభయకావేరీ మధ్యదేశమునకు రాఁగాఁ జెట్టుచేమ లేని స్థలమునఁబోవునప్పుడు మలమూత్రోత్సర్జనము చేయవలసివచ్చెను. అప్పు డొంటిపిల్లవాఁ డొకఁడు గోచరింప దీనిని నేనువచ్చువఱకు నీవు నేలయుంచక పట్టుకొని యుండుమని విభీషణుఁడు చెప్పెను. నేను నిలువనవకాశము లేదు. శీఘ్రముగఁబోవలెను. మూడుమార్లుపిలిచెదనువచ్చితివానీచేత నిచ్చెదను. రాకుంటివానేల నుంచిపోయెదనని యాబాలుఁడు చెప్పి కొంతదూరము పోఁగానే విభీషణా యని యొకసారికూర్చున్న సమయమున నొకసారి లేచుసమ యమున నొక సారి పిలిచి తిరుపగూడనందే భూమిపై నుంచి పరువెత్తెను. విభీషణుఁడు కోపముతోఁ దఱుముకొని పోయి బాలుని నెత్తిపై మొట్టెను. ఈ పిల్లవాఁడే యుచ్చిపిళ్లారి ఇది దేవమాయ. ఆనాఁటినుండి రంగనాధుఁ డందే వసించుచున్నవాఁడు. కొంతకాలముక్రిందటివఱకు నిజమైన వైష్ణవబ్రాహ్మణులే యర్చించుచుండిరిగాని యిప్పుడు విభీషణుని భటులే బ్రాహ్మణవేషములతో శ్రీరంగనాధుని జుట్టియున్నారు. ఉభయకావేరు లేయిడాపింగళానాడులు. శ్రీరంగ క్షేత్రమే హృదయము. సప్తప్రాకారములే సప్తారణములు. దేవాలయమే దేహము. శ్రీరంగనాధుఁడే హృదయరంగ నాధుఁడు. యోగు లీ విధముగ రంగనాథుఁ దమ హృదయమందే దర్శింతురు. అంతుకుశక్తిచాలనివారు బాహ్యమున దర్శించి కృతార్థులగుదురు. ఫలమున రెండు సమానములే.

ఆత్మావలోకనము సిద్ధించిన యోగులకు విగ్రహారాధనమవశ్యకముగాదుగాని తక్కినవారందఱు విగ్రహముల నారాధింపక బాగుపడఁజాలరు. స్వయముగ మూఢులు విగ్రహారాధకుల మూఢులనుచు రెంట భ్రష్టు లగుదురు.

దుందుభి వాసుదాసుఁడు.

మాఘ శుద్ధ చతుర్థి

శ్రీ రా మ



మొదటి కూర్పు

# పీ ఠి క

1 ఈ శతకమును రచించిన రాజశ్రీ వావిలికొలను సుబ్బారావుగారు కడపజిల్లా పుల్లముపేఁట తాలుకా టంగుటూరు రేంజి మొదటితరగతి రివిన్యూ యిన్స్‌పెక్టరు. వీరి నివాసస్థలము కడపపట్టనము. శ్రీ కుమారాభ్యుదయ మను నొక మిశ్రప్రబంధమును సరసముగ రచించి ముద్రించి ప్రకటించి త్రిలింగ దేశమందంతటఁబ్రసిద్ధివడిసిన వీరిసాహితీపటిమఁగూర్చి మేమిక్కడ నొక్కి వక్కాణింప నక్కఱలేదు. శ్రీ సుబ్బారావు గారి శ్వశుంగృహము మాపట్టణమునుందుండు కారణమున వారు మొన్నటి దీపాళ్యుత్సవమున కిచ్చటికివిచ్చేయుటంబట్టి కొందఱీ యూరివారు మాచేఁ బ్రోత్సాహింపఁబడి యొకదినంబున మాచేఁ గల్పింపఁబడిన సభయందు కవిగారిని యథో చితంబుగ సత్కరింపఁదలఁచి యన్యులవలె ధనాకర్షణోద్యోగమునకుఁ గాక యూర కీ యూరి కడుదెంచి నట్టివారిని గౌరవముగ సన్మానించుటకు వేఱుపాయము లేమింజేసి యక్కవిరాజున కొక్క గజ మాలను సమర్పింప నందుకు వారు పంచరత్నంబులుబిదులిడిరి. అప్పద్యంబు లన్నియుమాచే బ్రకటింపఁబడు“అము ద్రిత గ్రంథచింతామణి” యను మాసపత్రికయందుఁ బొందుపఱుపఁ బడియున్నది.

2. నెల్లూరు రంగనాయకులపేఁట ‘వాక్చాతుర్యాభ్యసన సమాజ’ కార్యదర్శిగారగు శ్రీమాన్ నేలటూరు కృష్ణమాచార్యులవారిచేఁ బ్రార్థితులై యీ శతకము నుత్థానైకాదశీదినంబున శ్రీ సుబ్బరాయకవిగా రిచ్చట రచించి వారి కియ్య వారోకసభఁ గల్పించి పండితుల నాహ్వానముఁ జేసెదీనింజదివించిన యనంతరము బ్రహ్మశ్రీ దుర్భానుబ్రహ్మ ణ్యశర్మగారు సమాజమునకు మారుగఁ బంచరత్నంబుల రచించి కవిగారి కర్పింపఁగ వారందుకు గజమాల బదు లిడిరి. పంచరత్న సహితమై గజమాల యిందలంకరింపఁబడియున్నది.

3. ‘ముంజేతికడియమున కద్దమేల’ యను సామెతరీతిఁ జదువువారి కీ పద్యములు వేద్యములైనను గవివలన నిందలి చిత్రముల గొన్నిటి నెఱిఁగి యిందుఁ గ్రిందఁ బొందుపరుచుచున్నారము. ఇది తల్పగిరి రంగనాయక శతకముగాన నిక్కవిప్రథమపద్యము మొదలు 12 వ పద్యము దనుక నుండు పద్యాదిమాక్షరములఁ గూర్చి చదివి న “ శ్రీరంగనాయకీనాయకాయనమ ” యని వచ్చునట్లును, 80 వ పద్యము మొదలు 90 వ పద్యమునందు మొదటిపాదపు బేసియక్కరములు గూర్చి చదివిన ‘వావిలికొలను’ అని గృహనామము వచ్చునట్లును, తృతీయ పాదమున నింటిపేరు పోడి యక్కరములు, స్వనామము ‘వా సుబ్బరాయ’ అని వచ్చునట్లును, 94వ పద్యము మొదలు 99 వ పద్యము దనుకఁ బ్రథమపాదప్రాసాక్షరములఁ గూర్చి చదివిన “ రామార్పణమస్తు” అని వచ్చునట్లును, రచియించి యున్నారు.

4. ఈ శతక ముద్రాపణ స్వతంత్రతఁ బ్రథమమున శ్రీమాన్ నేలటూరు కృష్ణమాచార్యులుగారు కవి వలన జెందినను త్వరలోఁ బ్రకటించుటకుఁగాఁ దమ యధికారమును శ్రీరంగనాయకీవిలాస ముద్రాక్షర శాలాధి కారుల కొసఁగినందున వారీశతకమును జక్కఁగ ముద్రించి ప్రకటించిరి. రంగనాయక శతకము గాన నిది రంగ నాయకీ విలాసముద్రితమగుట సముచితముగదా?

నెల్లూరు
15-1-94

ఇట్లు
పూండ్ల రామకృష్ణయ్య,
శ్రీ “అముద్రితగంథ చింతామణి”
పత్రికాధిపతి.

# పంచరత్న కందములు



శ్రీకరము,లలిత రస ర
త్నాకరము, తమోప్రజ ప్రభాకరము, ప్రమో
దాకరము, నీదుశతకము, 1
ప్రాకటముగ, సుబ్బరాయ, పండితరాయా.
చోద్యంబులు, విలసద్రస
హృద్యంబులు, సరస సాహితీద్యసుకవిరా
ద్వేద్యంబులు, దలఁపఁగ, నీ
పద్యంబులు, సుబ్బరాయ, పండితరాయా. 2
కందంబులు, కవిచాతక
కందంబులు, చదువుజనుల కందంబులు, నీ
కందంబులచందబు ల
మందంబులు, సుబ్బరాయ మహితో పాయా. 3
పూతము, నిరుపమ సుగుణ
వ్రాతము, పరితోషకారి ద్రాక్షా పాకా
న్వీతము, నీరచన, సుధా
పాతము, శ్రీ సుబ్బరాయ, పండితరాయా. 4
నుత కంబుకంఠమగు నీ
శతకంబు, సుధాప్రవాహశతకంబు, మదిన్
వెతకం, బురుషోత్తమునకుఁ
బతకంబిది, సుబ్బరాయ, పండితరాయా. 5

నెల్లూరు
25-10-93

దుర్భా సుబ్రహ్మణ్యశర్మ.

# గ జ మా ల



మాటికి మ్రొక్కు వాఁడ నెదమాటిన నీటగు నీటికెంపుగ్రా
ల్మేటికడాని డాలొడలు లేటికసుల్గల బోటిచోటికిన్
సాటిగఁ బాటిగాఁ దగుచు నాఁటికి, నేఁటికి మేటి శ్రీయశః
పేటికి రంగనాయకుల వీటికిఁ దద్బుధవర్య కోటికిన్. 1

సకల కళాభిమాన సువిశారదులున్ గురులున్ బుధో త్తముల్
సుకలగుణజ్ఞాతా నిధులు సూరులుశాంతివిధుల్ దయాప్రథుల్
ప్రకటిత సద్బుధుల్ సుకవిరాజులు నేఁడిఁటఁ జేరియున్న స
భ్యకు లటుగాక నామనవి నాదర మొప్పఁగ నాలకింపుఁడీ. 2

మాతగదా తెనుంగు వశమా దెసమాలిశ్రమాళిఁ గుందఁగాఁ
బ్రీతిగఁ దాఁ గనుంగొన, నరీణసురీతి ధురీణతాఢ్యతా
ఖ్యాతిగ దాని మస్పఁ దగదా? తగుదాతగఁ దానుగానిచో
మాతగదాయటంచునెదమాటికి నాటినఁ జేటు లేలగున్. 3

రాజులు లేరు నేఁడు కవిరాజులఁ రాజిల జేయఁ బ్రస్ఫూటాం
భోజనలోచనా వివిధభోజన యోజిత సౌఖ్యసంగతిన్
భూజనశస్తకీర్తిపరిపూజ్య సభాజనులై చెలంగఁగా
భోజునిఁబోలుదాత ధరఁబుట్టినఁ బుట్టఁడె కాళిదాసుఁడున్. 4

ప్రజలన్ దారిలఁ గాంచినట్టి ప్రజనా భావించి పాలింప భూ
భుజులున్ స్వీయుకళాభిమాన మతులున్ బూజ్యంబులౌ చుంటనేఁ
టిజనుల్ మీవలె శక్తి యాగలిగి పాటింపంగ సంఘంబునం
ద జగంబందును నిల్చుటల్ దెలియ నాంధ్రంబేలజాలింబడున్

అస మెసఁగఁగ నాదొసఁగులన్నిటి వీసము దోస మెంచకే
పోసఁగఁగ మేల్పసల్గలయబూసి గుముల్ గొనిదాసివాసిమా
నిసిగను నన్నుఁ జేసిదివి నిచ్చలునిల్పఁగఁ జేయవెండి మీ
రొసఁగితి రయ్యలార కొనరొప్పఁగనీనియశంబులన్ వెసన్ 5

గౌరవముంచి మీరు కొఱగామి యటంచని వీడనాడకే
వారకుదారసారమతి వాసిగనన్ ననుఁజేయుటన్ ధరన్
దా రెనటంచు నెంతుఁ గవితావనితాపరితాపదుర్దశా
భారము గావ్యకన్యకలవార మపారముగాఁ జెలం గెదున్. 6

అర్మిలి రంగనాయకున కర్పణచేసిన నూఱుకందముల్
కూర్మిని మీరు నేఁడు సభకున్ వినిపించిగ్రహించుటల్ మహా
ధర్మగుణంబులే మెఱసెఁ దద్దయు నేమునుబాములందు న
త్కర్మములేమిచేసితినొ కై కొను నేఁడిటువంటి పూజ్యతన్. 7

కం. రసికాశ్రయసురభూజము
పసగల తేజమున నొప్పు వాక్చాతుర్యా

భ్యసన సమాజము నెగడున్
రసికశిఖోత్తంసమైన రంగని కృపచేన్.



నెల్లూరు
25-11-93

ఇట్లు
వావిలికొలను సుబ్బరావు

శ్రియై శ్రీరంగనాయకై నమః

# శ్రీ తల్పగిరి రంగనాయక శతకము.

## క ం ద ప ద్య ము లు

శ్రీ కరుణాకర, భక్తవ
శీకర, నరసురవినికర, శికర ఖరద
ర్వీకర మదహర, ధృతదర
శ్రీకర నెల్లూరివాస శ్రీరంగేశా. 1

రం గా,హతమాయాసా
రంగా, సారంగమదవి రాజితముఖశో
భాంగా, సాష్టాంగము నర
సింగా, నెల్లూరివాస శ్రీరంగేశా. 2

గ జరాజవరద, మదభూ
భుజరాజదరద, ముకుంద, పూజితపద యం
గజరాజకలిత హృన్మన
సిజహారనుత, జలనివేశ శ్రీరంగేశా 3

నా రదనుత, నిజతనుజిత
నారద, తతనిరత పణిత నారదవాహా
నారదనాదార్యగ్రజ,
శ్రీరద,నెల్లూరివాస, శ్రీరంగేశా. 4

య యదకులభవ, భవహృద్భవ
భిదురభృదాదిస్వరూప, విరహితకోపా
సదయామలతతకోమల
హృదయా, నెల్లూరివాస, శ్రీరంగేశా. 5

కీ శాధిపసుహృదా, నా
కేశాధిప మిమత మదని కృంతనచణ శ్రీ
కేశా, హరిలోకేశా,
శ్రీశా, నెల్లూరివాస, శ్రీరంగేశా 6

నా రాయణ, నిజసుకథా
పారాయణ లోపలహృదయ వరభక్తజనా

ధారావనసుపరాయణ
చేరితినిన్జగదధీశ శ్రీరంగేశా. 7

య జ్ఞాంగ యజ్ఞ పురుషా
విజ్ఞానము తాంతరంగ వేశా, శ్రీశా
ప్రజ్ఞాసమగ్ర, సాత్త్విక
జిజ్ఞాసుజనాతిసులభ, శ్రీరంగేశా. 8

కా లస్వరూప, రావణ
కాలా, నిజరూపహసిత కాయజకోటి
లీలా, కార్తస్వరరుచి
చేలా, నెల్లూరివాస, శ్రీరంగేశా. 9

య మునాఖేలా పరగజ
గమనాపటపటలహరణ కరణా,కమలా
కమనా, భవశమనా, చే
సి మనవి, నినుc గొలుతునీశ శ్రీరంగేశా. 10

న తవరసఖ, హరిసుతవా
నరవరసఖ, భక్తసుముఖ, నరహర, హరి, కి
న్నరవరసఖసఖ, కువిముఖ
సిరవర, నెల్లూరివాస, శ్రీరంగేశా. 11

మ నుజాధిప,శరణాగత
దనుజాధిపరాజ్యదాన తత్పరచతురా
తనుజాకృత లోకామల
జినసుత, నెల్లూరివాస, శ్రీరంగేశా. 12

రామా, రాక్షసలోకవి
రామా, రవికోటిధామ, రంజితబుధసు
త్రామా, కామాసమరుచి
సీమా, నెల్లూరివాస, శ్రీరంగేశా. 13

మధుసూధన, మధుసూదనౌ
మధుమిత్ర సవర్ణరూప మాధవ, నృహరీ
మధుసూధనాగ్రజన్మా
శిధిలముc గావింపు మఘము శ్రీరంగేశా. 14

రామా, నయనకలిత రవి
సోమా, నిజనామసక్త సోమా, రుచిరో
ద్దామా, శుభనామా, సు
స్థేమా, నెల్లూరివాస, శ్రీరంగేశా. 15

రక్కసి ముక్కును జెక్కిన
వెక్కసముగ దిక్కులెల్ల బిక్కటిలంగా

రక్కసులు ద్రొక్కనుక్కనుఁ
జెక్కవె నెల్లూరివాస శ్రీరంగేశా. 16

పాదంబులు, నతమోక్షా
పాదంబులు, వేదివిద్వి వాదంబులు, స
మ్మోదంబులు, పాపలతా
ఛేదంబులు, చూపు మీశ శ్రీరంగేశా. 17

జానులు సురుచిరశోభా
ఖానులు, నిరతాపగీర్ణ కలుషహిమానీ
భానులు, నాకుం జూపవె
శ్రీనరకాసురవినాశ శ్రీరంగేశా. 18

ఉదరము, పంకమహీధర
భిదురము, వినతాపదాళి విధురము, వైరి
ప్రదరము, మద్ద్రఢపాప
చ్ఛిదరమణత నమరునీశ శ్రీరంగేశా. 19

ఉరముం, బద్మాలయమం
దిరమున్, మరుజన్మపురము స్థిరసౌందర్యా
దరమున్, హారోత్కరసురు
చిరమున్, వే చూపు మీశ శ్రీరంగేశా. 20

కరములు, శ్రితజనసంప
త్కరములు,ధృతచక్రశార్ఙ్గ దరముల శోభా
కరములు, సురనికరావన
చిరములు,నెల్లూరివాస శ్రీరంగేశా. 21

నఖరంబులు, రాక్షసదళ
న ఖరంబులు, పవిసఖములు, నవనీతహరో
న్ముఖరంబులు, దృఢసునిశిత
శిఖరంబులు, చూపు మీశ శ్రీరంగేశా. 22

కంఠము, నతావన సము
త్కంఠము, వనమాలికోప కంఠము, భవసో
ల్లుంఠము, రుచినిష్కుంఠ మ
కుంఠితమతి నాకుఁబ్రాప గున్ శ్రీరంగేశా. 23

ముఖమున్, శతరాకావిధు
సఖమున్, నిజనుతివిలోల జనతాప్రద స
త్సుఖమున్, దుఃఖేంధనదవ
శిఖమున్, జూపర, రమేశ శ్రీరంగేశా. 24

నేత్రాంబులు, కరుణారన
పాత్రంబులు, పుండరీక ప్రసవాళీ స

జ్ఞత్రంబులు భవనాశన
చిత్రంబులు, జూపు మీశ శ్రీరంగేశా. 25

శ్రవణంబులు, యుతకుండల
రవణంబులు, ధృతవతంస రసమద్వేహా
రవణంబులు, సురుచిర రు
క్రవణంబులు, వేగ చూప రా రంగేశా. 26

నాస, సుగంధలీసుమ
భాస,సమవిలాస, దాస భరణవికాసో
ల్లాస,నతాకాశచరా
గ్రేసర, నెల్లూరివాస శ్రీరంగేశా. 27

కందమ్ములు, సురదమ్ముల
బృందమ్ములు, మృదుపదమ్ము లిమ్ముల మఱి కై
కెందమ్ములు, చక్రమ్మును
జిందమ్మును, జూపుమీశ శ్రీరంగేశా. 28

మురళీరవ విరళీభవ
తరళీకృత హృదయదేహ తరు హ
శరఖుళీపరత, భళీ
చిరలీలల నెసఁగితీశ శ్రీరంగేశా. 29

వేషాధిక, యోషాహర
దోషాచరనాశ డింభ దోషాచరసం
తోషాకర భూషాధుర
శేషా నెల్లూరివాస శ్రీరంగేశా. 30

శేషా మృదుభాషానత
పోషా సురతోష విమల భూషా ఖరవి
ద్వేషా దోషాహారణ వి
శేషా నెల్లూరివాస శ్రీరంగేశా. 31

మీసమ హృదయావిదిత సు
మానమ, బలశౌర్య నిస్స మానమ పృధుపా
ఠీనమ, యఘుచయ చటక
శ్యేనమ, నెల్లూరివాస శ్రీరంగేశా. 32

హాలాహల మాలావిల
కోలాహల నాశ, ధవళ కూలంకషజా
తాలయ కర్బురమయ స
చ్చేలా నెల్లూరవాస శ్రీరంగేశా. 33

పచ్చనివలువయుఁ జెలువయుఁ
బచ్చనిడాల్గ్రాలు డాలు బచ్చనికొడుకున్
బచ్చని డంబౌ కన్నులు
చిచ్చోగిరముంగలాఁడ శ్రీరంగేశా. 34

తెల్లనిమలయునుఁ దెలెయును
దెల్లని యిల్లాలు మఱియు దెల్లనియొడలున్
దెల్లని యెకిరింతయుఁగాఁ
జెల్లిన చెలికానిగల్గు శ్రీరంగేశా. 35

బాఁపడు మృతి పాపనికిని
దాపురమైయున్ననీదు దాపునఁజేరన్
బాపురెయన జేజే లటు
చపట్టవె జగదధీశ శ్రీరంగేశా. 36

తెల్లని బూరుగ గూఁతురు
నల్లని కొడుకందు మిగుల నల్లనిమేనున్
జెల్లెల దెట్టన, నీకే
చెల్లెను నెల్లూరివాస శ్రీరంగేశా. 37

కావలుఁడు దుస్ససేనుఁడు
కావరమున వలువ లొలువఁ గడుకొనివేఁడన్
ద్రోవదిని దయను బ్రోవవె
శ్రీవర నెల్లూరివాస శ్రీరంగేశా. 38

క్రోఁతుల నానాజాతుల
దూతలుగాఁజేసి కాలు దూతల కసుర
వ్రాతము నర్పించితి బల్
రీతుల నెల్లూరివాస శ్రీరంగేశా. 39

శరనిధి ముట్టుటమాత్రన
శరనిధి గర్వంబు నుక్కుఁ జక్కడఁచితి, దా
శరథీ మోక్ష మొసంగుము
సిరివర నెల్లూరివాస శ్రీరంగేశా. 40

మిత్రకులంబునఁ బుట్టుట
మిత్రసుతున్ రాజుఁజేసి మేలిమిఁగనితౌ
శత్రువౌకొ యింద్రసూనుఁడు
చిత్రము నెల్లూరివాస శ్రీరంగేశా. 41

రాజకులంబునఁ బుట్టుట
రాజిలి హరిసూను సుమతి రతి హరిపుత్రున్
ఆజిని హరియించితి వు
ర్వీజారమణా రమేశ శ్రీరంగేశా. 42

ప్రాణము భక్తులు నీకును
బ్రాణము భక్తులకు నీవు భక్తాళీసం

త్రాణము నీకును దీక్ష య
రీణగుణామేయ యీశ శ్రీరంగేశా. 43

జంభారి విజృంభణ సం
రంభకృతారంభ జంభ రంభాదిపరీ
రంభారంభము దంభవి
జృంభము నొల్ల నీశ శ్రీరంగేశా. 44

భావించెద నిన్నెద నేఁ
గావించెదఁ బూజ నీకుఁ గమలాధవ ని
న్నే వించెద ముక్తిదుఁడవని
సేవించెద నయ్య యీశ శ్రీరంగేశా. 45

పాలింపుము నన్గ్రపచేఁ
దూలింపుము నాదుబహుళ దోషంబులు నన్
లాలింపుము నీవురి శుభ
శీలా కరుణావాల శ్రీరంగేశా. 46

వాణీ శర్వాణీ గీ
ర్వాణీ వృత కమలజాత పాణీ యళీనీ
వేణీ సురతాణీ యని
శ్రీనిన్ నీజాయనెంతు శ్రీరంగేశా. 47

అడుగుట నొరు లడిగినచో
నుడువుట లేదనుచు నాదు నుడి నీరెండున్
బొడమక యుండఁగ నేలుమి
చెడుగులు ననుఁజేరకుండ శ్రీరంగేశా. 48

భూవులకోవుల పాపుల
దాపువ నేనేరఁదోఁప దాపురమగుటన్
బ్రాపయి యిటు సమ్మితి నినుఁ
జేపట్టుము భవవినాశ శ్రీరంగేశా. 49

గట్టిగఁ గట్టిఁడియని నను
నెట్టకు బెట్టిదము ముట్ట నెట్టిన దయచేఁ
బట్టుము దొట్టక యుండఁగ
జెట్టలు నెల్లూరివాస శ్రీరంగేశా. 50

విసువక విసమును మెసవితి
పసవెస నెసఁగంగ నసము పసులను మేపన్
బొసఁగిన నగ్గి గ్రసించితి
సిసువై యుండంగ నీవు శ్రీరంగేశా. 51

డాపట వలసట ముందఱ
గాపుగ నా వెన్ననిలిచి కలకాలంబున్
బ్రాపయి ప్రాపునొనర్పుము
శ్రీపతి నెల్లూరివాస శ్రీరంగేశా. 52

వేలుపుల నీవు పెద్దవు
నేలం గలపాపులందు నేనే పెద్దన్
ఏలెద వెట్టులొ నయగుణ
శీలా నెల్లూరివాస శ్రీరంగేశా. 53

బంతగు గొంతుల రక్కసుఁ
జింతల దొంతరలఁ ద్రోచి చించితివౌరా
యెంతని నుతియింతును నా
చేంతల నీలుమయ్య యీశ శ్రీరంగేశా. 54

అనఘులు మునివరులగుటను
ఘనమా వారలను ద్రోచు కర్జము ననుఁబోల్
ఘనపాపిష్టుని రక్షిం
చినఁగద నీనేర్పు నెగడు శ్రీరంగేశా. 55

చీఁకటిఁ బాపఁగదీపము
ప్రాకటముగ వలయుఁగాక ప్రభయందేలా
నాకలుషములును బాపవె
శ్రీకర విజ్ఞానమొసఁగి శ్రీరంగేశా. 56

దాసుఁడ నవిదితయోగా
భ్యాసుఁడ నీవిమలనామ పఠన నితాంతా
భాసుఁడ నన్నేగతిగాఁ
జేసెదొ నెల్లూరివాస శ్రీరంగేశా. 57

రంగాయని రంగప్పని
రంగేశా రంగధామ రంగనయనుచున్
రంగుగఁ దలఁచెద నిన్ను హ
రింగా నెల్లూరి వాస శ్రీరంగేశా. 58

కతిరక్షణ దవభక్షణ
పరశిక్షణ పరమకరుణ వనజేక్షణ సుం
దరచరణా నతభరణా
స్థిరకరుణారస విహారణ శ్రీరంగేశా. 59

వల్లవ వనితాజనతా
పల్లవ సుతమాలపల్ల పకలితకేశా
వల్లభకృతత ఖగవల్లభ
చెల్లింపుము నా సదాశ శ్రీరంగేశా. 60

శృంగార రసాధారా
సంగీతకళానిచార సరసోదారా
భృంగారకర విహారా
చెంగట నిలుమా రమేశ శ్రీరంగేశా. 61

నవనీతాదికచోరా
యనినీత నృపాలమార యవనీధారా
యవనీమానసచోరా
శివవనుతా రసనివేశ శ్రీరంగేశా. 62

దక్షాధ్వరవిధ్వంసన
దక్షవిచక్షణసుమిత్ర దక్షాత్మభవా
ధృక్షసురక్షణచణ ఖల
శిక్షణ నెల్లూరివాస శ్రీరంగేశా. 63

హత్తిన బత్తిని సత్తిని
బుత్తికి ముత్తికిని గాఁగ మొత్తమ్ములుగా
నెత్తమ్ముల నెత్తమ్ములఁ
జిత్తమ్మునఁబూజలిడుదు శ్రీరంగేశా. 64

అంగదఁ గలిగించితి వీ
వంగదునకు రత్నసుఖచి తాంగదయుతచి
త్రాంగా భవసంగంబులఁ
చెంగింపు కృపానివేశ శ్రీరంగేశా. 65

హీరంబుల హారంబుల
వారంబులు వక్షమునను బరినటియింపన్
గోరిననారిని దేరిని
జేరిచితౌరా రమేశ శ్రీరంగేశా. 66

అంగంబున నఱనరుఁడును
సింగంబున నైతివేమి సింగారమొ సీ
రంగా 1 దుర్జనభంగా
సింగిణిఁ జేగలుగునీశ శ్రీరంగేశా. 67

తాతకుఁ దాతవుగానై
మాతకుఁ దా మాత రమను మఱియేలితివౌ
జాతులు నీతుల చేఁ తల
రీతుల నీ కెందుఁ గలవు శ్రీరంగేశా. 68

జనకుఁడ వయి లోకములకు
జనకుని పుత్రికను నీకుఁ జనునే కొనఁగా
నని మొనఁ జెంగించితి నిం
జెనకినయాజామదగ్ని శ్రీరంగేశా. 69

పటపట పెటలెను దిక్కులు
తటతటగుండియలు పగిలె ధాతకు మఱియున్

లొటలొటలాడె నజాండము
చిటపట విల్విఱుచనీవు శ్రీరంగేశా. 70

అచ్చపు ముచ్చట నిచ్చలు
మచ్చిక లెచ్చంగనిచ్చ మఱిగ్రుచ్చెదనే
నచ్చుగ నీసచ్చరితముఁ
జెచ్చెరఁబొచ్చెంబులేక శ్రీరంగేశా. 71

అబ్బురమగు నిబ్బరమున
గుబ్బలిఁ గొనవ్రేలనెత్తి గొబ్బునఁగావన్
గిబ్బలను గుబ్బలాఁడుల
సెబ్బర లేకుండఁ జెల్లె శ్రీరంగేశా. 72

తళుకులు బెళుకులు పలుకులు
కులుకులు మరుములుకులొలకు కొలఁకుల కలుకుల్
చిలుకల కొలుకులు వ్రేతలు
చెలఁగఁ విహరించితౌర శ్రీరంగేశా. 73

హలివై బలివై వెండి ము
సలివై మగధేశుఁబట్టి జబ్బలు విఱుగన్
జలమున మొత్తవె నెత్తురు
చిలుకఁగ నెల్లూరివాస శ్రీరంగేశా. 74

మోక్షార్థిఁగాస వన్యా
పేక్షను నినుఁచేరఁజు మ్ము పేక్షించెదవో
రక్షించెదొ భక్షించెదొ
శిక్షించెదొ వే రమేశ శ్రీరంగేశా. 75

కాపాడుము కాపాడుము
కాపాడుమటంచుఁ గోరి క న్నినుఁబిలువం
జేపట్టితి ననరాదా
శ్రీపతి నెల్లూరివాస శ్రీరంగేశా. 76

పలికిన నీవ వాముత్రైము
లొలుకునె మఱి పలుకవేల నొప్పులు గులుకం
గులుకా హృత్పంజరపుం
జిలుకా నెల్లూరివాస శ్రీరంగేశా. 77

తృష్ణాతరణమన స్మృగ
తృష్ణానది నీరుఁగొనుట తెలియఁగఁ దలతున్
విష్ణుఁడవని జిష్ణుఁడవని
కృష్ణా నెల్లూరివాస శ్రీరంగేశా. 78

ధగధగ మెఱియు కిరీటము
భుగభుగమను నొడలితావి బుగులుకొనంగాఁ

దగుఁదగుననఁ బూదండలు
సిగవెలుఁగఁగఁగజూపుమోము శ్రీరంగేశా. 79

బృందావనలోలా సుర
బృందావనలోల మిత్ర విందాలోలా
డెందంబుననే ముక్తిని
జెందంగను గను రమేశ శ్రీరంగేశా. 80

లేవా మోమిటుచూపఁగ
రావా ననుఁగావ నింత రాజసమా యే
త్రో వో నీవిటుచేసిన
శ్రీవాసా జగదధీశ శ్రీరంగేశా. 81

నే వినుతు వినుము నిన్నే
భావించెద దైవమనుచుఁ బాలించెదవో
గావించెదవో మోసము
సేవించివారిఁజెఱు తె శ్రీరంగేశా. 82

వాలిని నొకకోలనుధరఁ
గూలఁగఁబడవైచి కూర్మి కొమరుగరాజ్యం
బేలింపవె సుగ్రీవుని
చే, లలితగుణాధివాస శ్రీరంగేశా. 83

కై కొనుము నాదుమనవులు
చేకొనుమానన్నుఁ బ్రోవ శీఘ్రముతోడన్
నాకారివారవైరీ
శ్రీకమలాకామినీశ శ్రీరంగేశా. 84

కలవాఁడవు సిరినెదపైఁ
గలవాఁడవు ముక్తినియ్యఁ గలవాఁడవటం
చెలమిని పిలచినఁ బలుకవు
సెలవీయవు మంచిమాట శ్రీరంగేశా. 85

అనువున విన్నను వునఁ గ్రొ
న్న సఁబోణులతుటుము బృంద ననవిల్తుని కే
ళిని హళహళికను క్రన్న నఁ
జెనకితి నెల్లూరివాస శ్రీరంగేశా. 86

వాసుకిఁ దరిత్రాడుగ దగఁ
గా సరగునమందరంబు కవ్వం బై పా
ల్రాసినిఁదఱచుచు విబుధులఁ
జేసితి వమరులుగ నీశ శ్రీరంగేశా. 87

దబ్బఱలుగావు నిన్నే
నిబ్బరముగ నమ్మినాఁడ నిమ్మళనముగ నా
యబ్బా లిబ్బుల నుబ్బఁగ
సెబ్బర లేకుండఁద్రోవు శ్రీరంగేశా. 88

రారా మోమిటుచూపఁగఁ
గోరా నాపూజలెల్ల గురుమతితోడన్
ఏరా పలుకవు యుతమం
జీరా నెల్లూరివాస శ్రీరంగేశా. 89

కావుము కాపుమటంచును
వావిరియఱువంగ నసుర బాలకుఁడా ర్తిన్
నీ వే తెలివిని బ్రోచితి
సేవకు వన్నట్టు గావు శ్రీరంగేశా. 90

వాసవి తెలియకొబలమును
భాసురముఁగఁ బోరఁద్రుంచి వాసరపతిజున్
వా, సుబ్బరాయనిఁగ 1 వే
చేసితి కేసరి పురీశ శ్రీరంగేశా. 91

అప్పా, ముప్పులకడలికిఁ
దెప్పా, వున్నెములగొప్ప తిప్పా, పల్కన్
దప్పా, తప్పక తెప్పున
జెప్పర, నాతప్పులొప్ప శ్రీరంగేశా. 92

సోఁకినవారిని వారిని
నాకంబున నిల్పఁజా ల్వి నాకినినదికిన్
బ్రాకటమగు కుడివైపునఁ
జేకొనితిని,నిలువ నెలవు శ్రీరంగేశా. 93

ధీరా, ధీరాళ్వవనో
దారా, తారాపమద వి దారా, తారా
దారానుజాత్మచోరా
శ్రీరామా హృదయవాస శ్రీరంగేశా. 94

హేమాంబర నఖవిదళిత
హేమాంబర ధీనిధీ య హీనశయానా
శ్యామాంబరావరజ స్వ
స్త్రీమహితావృత రమేశ శ్రీరంగేశా. 95

దర్పకనృపనీహారా
హర్పతి,సుకపోల నింది తామలతాంచ
ద్దర్పణ, దర్పకజనకా
చేర్పుము మది నన్నుఁ బ్రోవ శ్రీరంగేశా. 96

ఝుణఝుణ మ్రోయఁగఁ గరకం
కణములు రవళింపఁగ ఘణ ఘణయనిగజ్జెల్

సొణసొణయన కిటు రార హ
రిణనయనా తల్పగేశా శ్రీరంగేశా. 97

హిమకర హీమపరనయనా
హిమభూధరతుల్యధైర్య హిమనగజేడ్యా
హిమకరనిలయ నునిలయ, య
రిమదకమలభవ హిమకర శ్రీరంగేశా 98

కస్తురిరంగా నిస్తుల
శస్తగుణాకభంగసంగ శశ్వన్నతక
త్రస్తుల కస్తిం బాపఁగ
సిస్తుగఁజేసెద నుపాస్తి శ్రీరంగేశా. 99

ఇలఁగేసరిపుర తల్పా
చలరంగాధీశుపేర సలలితగతి వా
విలికొలను సుబ్బరావు సు
ఫలదశతకము ప్రచించి భక్తి నొసం గెన్. 100

ఓం తత్సద్బ్రహ్మార్పణమస్తు.
శ్రీతల్పగిరి రంగనాయక శతకము.సంపూర్ణము.

mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథనిలయం

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం,
రాజమహేంద్రవరము - 533101.
ఫోన్ : 0883 - 2462565
e-mail : mohanpublications@gmail.com

# మావద్ద లభించు గ్రంథములు



## వ్రత కథలు - పూజలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ. | 10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | | 30-00 |
| 5. | వరలక్ష్మీవ్రతం | | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | | 10-00 |
| 11. | వైభవలక్ష్మీవ్రతం ఫోటో యంత్రంతో | | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీకుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీవ్రతం (కామేశ్వరీపాటతో) | | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | | 30-00 |
| 18. | శివదీక్ష | | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారు) | | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | | 10-00 |
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | | 36-00 |

| | | |
|---|---|---|
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |



# స్తోత్రాలు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |

| | |
|---|---|
| 36. అష్టలక్ష్మీస్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. భగవద్గీత మూలం | 27-00 |
| 40. రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. కుజదోషం | 10-00 |
| 49. కాలసర్ప దోషం | 10-00 |
| 50. మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. పంచసూక్తములు | 10-00 |
| 53. సంధ్యావందనం | 10-00 |
| 54. రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. మహాన్యాసమ్ | 36-00 |
| 62. సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. గోమాతపూజావిధానము | 10-00 |
| 64. ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |
| 65. ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. అర్చన | 40-00 |
| 69. నిత్యదేవతార్చన | 40-00 |
| 70. సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |

